**Anuyogam** (Tripadulu)
by ***Kavishiromani***
**Prof. Raavikanti Vasunandan**



**Prof. Raavikanti Vasunandan**
Professor of Telugu
Principal Investigator UGC Major Research Project
Dr.B.R. Ambedkar Open University
Road No.46, Jubilee Hills, Hyderabad-33.
Cell: 9849852182

First Edition: **2009**

Price: **Rs. 30/-**

*For Copies:*
**All Branches of Vishalandhra**

*Printed at:*
**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph.: 2765 4003, 2767 6910, 27677078

## మాన్యశ్రీ యెల్ది సుదర్శన్ పద్మశాలి, ముంబాయి గారికి

*(అధ్యక్షులు, అఖిలభారత పద్మశాలిసంఘం సాహిత్యవిభాగం-హైదరాబాద్)*

## స్నేహాంకంగా . . .



ఎవ్వరు జెప్పగా వలతి యెవ్వరి ఈప్సితమెట్టులుండునో!
మవ్వపు ప్రేముడిన్ **తెలుగుమాటకు** దేశముగాని దేశమం
దెవ్విధి నీయొనర్చెడి నిరీహ నిషేవణముల్బణమ్ముగా
దివ్వెలుదీర్చ నెమ్మెయి బ్రదీప వికాసముగూర్తు సాహితిన్

ఇసుమంతైన గుణమ్ముగన్పడిన నీవెంతైన బ్రేమించు వి
శ్వసనీయోన్నత సత్కృతిన్ వెలుగుటన్ సానందకందమ్ముగా
వెసనర్పించెద నవ్య భవ్య కవితా విస్ఫూర్తి సన్మూర్తి యె
ల్ది సుదర్శన్! కొనుమయ్య మత్కృతి యశస్తేజంబు బెంపొందగన్

– వసునందన్

# ఆధునిక ప్రశ్నోపనిషత్తు "అనుయోగం"

డా. బి. జయరాములు
చైర్మన్, బోర్డ్ ఆఫ్ స్టడీస్ (ఓరియంటల్ ఫ్యాకల్టీ)
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు.

కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ గారు అనేక కావ్యాలను తన లేఖిని నుండి వెలువరించడం వల్ల కవిగా సుప్రసిద్ధులు. అంబేద్కర్ సార్వత్రిక విశ్వ విద్యాలయంలో తెలుగు ఆచార్యులుగా, డీన్‌గా వివిధ పదవులను నిర్వహించిన ఉత్తమ అధ్యాపకులుగా ప్రసిద్ధులు. జీవితంలో కష్ట సుఖాలను అనుభవించి, బాధలను ఉద్వేగాలను భరించి, వివిధ మానవుల మనస్తత్వాలను పరిశీలించి స్థిత ప్రజ్ఞను అలవరచుకున్న సిద్ధులు. ఇంకో ఆరు నెలల్లో వసునందన్‌గారి షష్టిపూర్తి జరుగబోతుంది. ఇలాంటి శుభ సందర్భంలో అరవై ప్రశ్నలతో కూడిన **అనుయోగం**ను సాహిత్యలోకాని కందించడం బహుధా ప్రశంసనీయం.

అనేక కావ్యాలు వ్రాసి కవిగా యశస్సు నార్జించిన వీరు ఇప్పుడు ఈ షష్టిపూర్తి సందర్భంలో ఈ కావ్యాన్ని 'త్రిపదులు'గా వెలువరించడంలోని ఆంతర్యం ఏమిటి? అసలు 'అనుయోగం' అంటే ఏమిటి? దానిలో ఏముంది? ఎందుకు వ్రాశారు? ఈ కావ్యం యొక్క అర్థం, పరమార్థం ఏమిటి? అనే ప్రశ్నలుదయిస్తాయి. అనుయోగం కావ్యాన్ని చదివి అంతరాంతరాల్లోకెళితే పై ప్రశ్నలన్నిటికీ సమాధానాలు లభిస్తాయి.

**అనుయోగం** అంటే అడగటం. ఎవరిని ఎవరడుగుతున్నారు? కవి తనను తానే అడుగుతున్నాడు. కవి సమాజాన్ని అడుగుతున్నాడు. కవి ఎదుటివ్యక్తిని అడుగుతున్నాడు అనే విధంగా సమాధానాలు చెప్పవచ్చును. కాని ఇప్పుడు ఇక్కడ మాత్రం కవి అంతర్ముఖుడై తనను తానే అడుగుతున్నాడు. ఈ అడగడాన్నే సంస్కృతంలో 'ప్రశ్న' అంటారు. పృచ్ఛించడమే ప్రశ్న. మనకు ఉపనిషత్తుల్లో ప్రశ్నోపనిషత్తు ఉంది. ఈ కావ్యం గూడా ఒకరకంగా తెలుగులో ఉపనిషత్తులాంటిదే. ఉపనిషత్తులు ఋషి ప్రోక్తాలు. కవిగూడా

ఋషి కదా! (నానృషిః **కురుతే కావ్యం**). దీనిలో అరవై ప్రశ్న లెందుకున్నాయంటే కవి తన అరవైయేండ్ల జీవిత సారాన్ని రంగరించి ఈ ఆంధ్రప్రశ్నోపనిషత్తును రచించారు. అరవై ప్రశ్నలు అరవై ఏళ్ళ జీవితానికి ప్రతీక. 'త్రిపదులు' అంటే మూడు పాదాల్లోనే ఎందుకు వ్రాశారు? సృష్టి త్రిగుణాత్మకమైనది. సత్వరజస్తమోగుణాలతో సృష్టి జరుగుతున్నది. ఆ సృష్టి తత్వాన్ని తన అనుయోగంద్వారా వివరించడానికి 'త్రిపదు' లను సంకేతంగా ఉద్దేశించారు. ఈ త్రిపదుల్లో ఏముంది?... మొదటిది ప్రశ్న. రెండవది ఉపమానం. మూడవది ప్రశ్నకు సమాధానంగా, వస్తుస్వభావం తెలిపేదిగా, తత్త్వప్రతిపాదకంగా ఉంటుంది.

ఇక అరవై త్రిపదుల్లో ప్రశ్నలను వదిలేస్తే మిగిలిన ఉపమాన, సమాధానాలు మొత్తం నూట ఇరవై. మానవుని పరిపూర్ణ ఆయుష్షు నూట ఇరవై సంవత్సరాలని ఏదో ఒక ఉపనిషత్తులో చదివినట్లు గుర్తు (ఇప్పుడా కారిక గుర్తు లేదు). దాన్ని ఇవి వ్యంజింప జేస్తున్నాయి. ప్రశ్నలు అరవై షష్టిపూర్తిని తెలుపుతున్నాయి. కావ్యప్రారంభం **కవిత్వం** తో చేశారు.

**ఎంతతెలుగు కవిత్వం?**
**అమృతంలా అంబుధిలా ఆకాశంలా,**
**అవనీతలాన్ని పునీతం చేస్తూ.**

కవిత్వం అంటే ఈ కవికి ఎంత మమకారం? అది అమృతంలా ఉందని దాని రుచిని, అంబుధిలా ఉందని లోతును (గాంభీర్యాన్ని), ఆకాశంలా ఉందని దాని రంగును తెలిపారు. కవిత్వానికి రంగేమిటి? శబ్ద చిత్రాల్లో, భావచిత్రాల్లో కవి మన చేత దర్శింప చేసేదే దాని రంగు. అది ఆకాశంలా ఉంది. "ఆకాశం గగనం శూన్యం" అంటే కవిత్వం రంగు చర్మచక్షువులకు కనిపించదని భావం. మనోనేత్రంతో, ఊహాశక్తితో, సహృదయంతో దాన్ని గ్రహించాలని బోధ. తెలుగు కవిత్వం అవనీతలాన్ని పునీతం చేసిందంటున్నారు కవి. నిజమే! కవిత్వం లేకుంటే జీవితంలో ఆనందం ఎక్కడుంది? ఆర్ద్రత ఎక్కడుంటుంది? వాటితోనే భూలోకం స్వచ్ఛమై, సౌందర్యయుతమై పునీతమౌతుంది. ఇంతకూ **ఎంత తెలుగు కవిత్వం?** అనేది ప్రశ్నా? ఆశ్చర్యార్థకమా? ఆశ్చర్యంతోకూడిన ప్రశ్న. ఇలా ప్రారంభమైన మొదటి 'త్రిపద' లో అమృత శబ్దం మోక్షాన్ని (అమృతత్వం), అంబుధి శబ్దం సంసారసాగరాన్ని, ఆకాశ (శూన్యం) శబ్దం సృష్టి అశాశ్వతత్వాన్ని, మాయను వ్యంజింపజేస్తున్నాయి. అవనీతలం పునీతం కావాలంటే దానిపై నివసించే మానవులు సృష్టి అశాశ్వతత్వాన్ని, మాయను గ్రహించి, సంసార సాగరం నుండి బయటపడి, అమృతత్వాన్ని సాధించాలని కవి ఆశంస. మొదటి కవిత 'నాంది' లా ఉంది. నాందిలో 'ఆశీర్నమస్క్రియా వస్తు నిర్దేశా'ల్లో ఏదో ఒకటుండాలి. దీనిలో వస్తు నిర్దేశం నిక్షిప్తం చేయబడింది.



ఇక చివరి కవిత **భరతవాక్యం**లా ఉంది. భరతవాక్యం సహజంగా లోకానికి, దేశానికి మంచిని కాంక్షిస్తూ ముగుస్తుంది. ఈ కవి భరత వాక్యం చూడండి -

**ఎందుకు ఉండాలి లోకాలన్నీ సుఖంగా?**
**ఎండకూ వానకూ వసివాడని పువ్వుల్లా,**
**మానవతా సత్ఫలాలను ప్రసాదిస్తూ.**

ఇక్కడ లోకాలు సుఖంగా ఉండాలంటే ఆ లోకాల్లోని జీవులనే అర్థం. జీవుడు దీనిలో ఎండకూ వానకూ వసివాడని పువ్వుతో పోల్చబడ్డాడు. కనిపించే ప్రకృతికి, లోకాలకు, ప్రకృతిసిద్ధమైన శరీరాలకు శాశ్వతత్వం లేదు. జీవుడే శాశ్వతుడు. ఈ అశాశ్వతత్వాన్ని 'సు-ఖ' శబ్దం వ్యంజింప జేస్తుంది. 'సు' అంటే మంచి 'ఖ' అంటే ఆకాశం, శూన్యం అని అర్థం. కళ్ళకు కనిపించేదంతా నశిస్తుంది కాబట్టి జీవుడు మానవ శరీరంలో ఉన్నంతకాలం 'మానవత్వం' కలిగి జీవించాలని ఉద్బోధ. మానవతా సత్ఫలాలను ప్రసాదించడమంటే మానవుడు మానవుడుగా (దానవుడు కాకుండా) జీవించడమే! అని అర్థం. గాలిబు గీతాలననువదిస్తూ ఇలాగే "నరుడు నరుడౌట కరము దుష్కరము సుమ్ము" అన్నాడు దాశరథి.

'అనుయోగం' కావ్యం యొక్క ఆద్యంతాలను పరిశీలిస్తే ఇది ఒక నాటకంలా భాసిస్తుంది. జీవితమే ఒక నాటకంకదండి ! అందుకే షేక్సిపియర్ "Life is drama" అన్నాడు. దానిలో seven stages చెప్పాడు. మనవాళ్లూ అలాగే భావిస్తారు - జీవితం ఒక నాటకమనీ, ఈ నాటకాన్ని ఆడించేవాడు ఆ పరాత్పరుడనీ. సరే! నాటక విషయం వదిలేస్తే ఈ కావ్యం మొత్తం ఒక చక్కటి తాత్త్విక నేపథ్యంతో రచించినట్లు కనిపిస్తుంది.

మనబుద్ధి కందినంతవరకు ఆలోచిస్తే మన జీవితం మొత్తంలో కనిపించేవి - వ్యష్టి, సమష్టి, సృష్టి, పరమేష్ఠి - అనే నాలుగంశాలు. వ్యష్టి - ఈ లోకంలోని మానవుని గురించి, అతని తత్వాన్ని గురించి వివరిస్తుంది. సమష్టి - సమాజాన్ని గురించి, సామాజిక తత్వాన్ని గురించి విశదీకరిస్తుంది. సృష్టి - సమస్త చరాచర ప్రకృతి సృష్టిని గురించి, దాని తత్వాన్ని గురించి తెలుపుతుంది. పరమేష్ఠి - ఈ అన్నిటి అస్తిత్వానికి మూలమై జగజ్జీవితం నడవడానికి ఆధారంగా ఉండే పరమాత్మతత్వాన్ని భాసింపజేస్తుంది.

'అనుయోగం' కావ్యం - వరుసక్రమంలో కాకపోయినా - ఈ నాలుగు తత్వాలనే చిత్రించింది. దీనిలోని ప్రశ్నలు, పోలికలు, సమాధానాలు అన్నీ జిజ్ఞాసువులను ఆలోచింపజేసేవిగా ఉన్నాయి. సాహిత్యం ఆలోచనామృతం కదండీ ! ఆలోచిస్తే అందులోని అమృతాన్ని కొల్లగొట్టవచ్చు. లేక అలసత్వంతో దీనిలో ఏముందని వదిలేస్తే ఏమీ కనిపించదు. పైగా ఈ కవి కవిత్వంలో ఏముంది? అని ప్రశ్నించే స్థాయికి దిగజారడం జరుగుతుంది. విషయ విస్తృతిని దృష్టిలో పెట్టుకొని ప్రతి కవితనూ విడి విడిగా వ్యాఖ్యానించకుండా స్థూలంగా కవితాతత్వాన్ని వివరిస్తాను.

వ్యక్తి తాను సంస్కరించబడి, భౌతికంగా, బౌద్ధికంగా, మానసికంగా వికసించి, సమాజం సక్రమ మార్గంలో నడవడానికి దోహదం చేస్తూ, సృష్టితత్వాన్ని గ్రహిస్తూ, పరమేష్ఠిలో ఐక్యం కావడానికి సాగించే ప్రస్థానమే జీవితం. అందుకే ఈ కవి - "ఎంత ఉద్ధృతం జీవితం?" (9వ ప్రశ్న) అని ప్రశ్నించారు. 'ఉద్ధృతం' అనే మాటకు - పైకెత్తబడింది, చేదబడింది, అనుభవించి విడువబడింది - అనే అర్థాలున్నాయి. మొదటి రెండర్థాలు జీవితం ఇతరులచే ఉద్ధరించబడిందనే భావాన్ని తెలుపుతున్నాయి. ఇతరులు కాకున్నా తనను తాను ఉద్ధరించుకోవలసిందే! మూడో అర్థం "అనుభవించి విడువబడింది" అనే అర్థం విశేషమైంది. దీనిలోనే తాత్త్వికార్థం ఉంది. ఎలా అనుభవించబడిందంటే - "అనుభవాల అనుభూతుల వరదలా". అనుభవం - జన్మననుసరించి కలిగేది, అనుభూతి - భూతి ననుసరించి కలిగేది. 'భూతి' అంటే సృష్టిసంపద (విభూతిః భూతి రైశ్వర్యం). ఈ అనుభవం "వ్యక్తిత్వాన్ని పరిపూరితం/పరిపూతం చేస్తూ" - సాగింది. అలా సాగుతున్న జీవితాన్ని అంటిపెట్టుకొని ఉండకుండా వదిలేస్తే ఇహలోకంలో వ్యక్తిత్వం పరిపూరితం అవుతుంది. పరలోకంలో పరిపూతం అవుతుంది. ఆహా! ఎంత చక్కటి భావన! ఎంత గంభీరమైన భావుకత ! జీవితాన్ని మథించి తత్త్వాన్నందించే ఈ కవి నిజంగా ధన్యుడు.

ఇక దీనిలోని 'వ్యష్టి' విషయాలను పరిశీలిద్దాం. వ్యక్తిలో రెండు రకాల గుణాలుంటాయి. 1) అనుకూలమైనవి (Positive qualities ) 2) ప్రతికూలమైనవి (Negative qualities ). అనుకూలమైన లక్షణాలు ఆ వ్యక్తి వ్యక్తిత్వ వికాసానికి దోహదం చేసి అతన్ని ఉన్నతునిగా, ఉత్తమునిగా తీర్చిదిద్దుతాయి. ప్రతికూల లక్షణాలు అతన్ని శారీరకంగా మానసికంగా కుంగదీసి వ్యక్తిత్వం లేని వ్యక్తిగా, మానవత్వం లేని మనిషిగా తయారు చేస్తాయి. అందుకే మన పురాణేతిహాసాలు (రామాయణ భారతాదులు) మంచిని అలవరచుకొమ్మని, చెడును వదలమని చెబుతున్నాయి. "రామాదివత్ వర్తితవ్యం, న రావణాదివత్" అని ప్రబోధిస్తున్నాయి. అలాగే వసునందన్‌గారు తమ కావ్యంలో - కష్టమైనా మంచి గుణాలను అలవరచుకొమ్మని, సుఖమనిపించినా చెడుగుణాలను వదలమని ప్రబోధిస్తున్నారు. కొన్నిచోట్ల ప్రత్యక్షంగా, కొన్నిచోట్ల అన్యాపదేశంగా, మరికొన్నిచోట్ల ధ్వన్యాత్మకంగా ఈ ప్రబోధం కనిపిస్తుంది. ఆయన ప్రశ్నించి అలవరచుకొమ్మని చెప్పిన అనుకూల లక్షణాలు - సహనం (16/36), సమయపాలనం (20), పరార్థ జీవితం (34), శోధన తత్త్వం(45), సత్ప్రయత్నం (59), లోక సుఖం కోరడం (60). ఆయన వదులుకొమ్మని చెప్పిన లక్షణాలు అత్యధికంగా ఉన్నాయి. వాటిని వదులుకోవడం వల్ల వ్యక్తి మానసికంగా ఎదిగి, మనిషి మనీషిగా మారి, ఉన్నత శిఖరాలనధిరోహించి, పురుషార్థ సాధకుడవుతాడని కవి భావన. మానవుడు వదులుకోవలసిన లక్షణాలు - స్వార్థం (2), క్రోధం (3/47), లోభం (4), మోహం (5), మదం (6), మాత్సర్యం (7), ఆశ (10), ఆర్భాటాలు (పై పై కోటింగులు) (15/28), మూర్ఖత్వం (19), ధనేషణ (సంపాదనాదాహం) (21), కృతఘ్నత (23), విచ్చలవిడితనం (24), చాదస్తం (25), ఆకర్షణలకు



లొంగకుండడం (26), వ్యామోహం (27), చాంచల్యం (31), అదుపులేని ఆవేశం (33), అహంకారం (38), మమకారం (39), ప్రలోభాలకు లొంగకుండడం (43), స్వాతిశయం (46), అసూయ (కడుపులోమంట) (48) - ఈ ప్రతికూల లక్షణాలలో అరిషడ్వర్గాలు, అహంకార మమకారాలు వదలడం ఆధ్యాత్మికతకు దోహదం చేస్తుండగా మిగిలినవి వ్యక్తి సంస్కారానికి, సమాజ శ్రేయస్సుకు తోడ్పడతాయి.

'సమష్టి' విషయాలు వ్యష్టివిషయాల సమాహారమే అవుతాయి. వ్యక్తుల సమూహమే సమాజం కదా! పైన చెప్పిన వ్యష్టి లక్షణాలతో పాటు జీవితం గురించిన అవగాహన (9), గౌరవం గురించి గ్రహించడం (44), తీవ్రమైన ప్రశ్నలు (14) - సమష్టికి సంబంధించినవి. ఇవికాక కవికి, కవిత్వానికి సంబంధించిన లక్షణాలు కొన్ని చెప్పారు. కవిత్వాన్ని చదివి, విని, ఆనందించేవారు సామాజికులు. కావ్యానందం వారికే లభిస్తుంది. ఆ కావ్యానందం బ్రహ్మానంద సహోదరం. ఇది మానవుని సహృదయునిగా, పవిత్రునిగా తీర్చిదిద్ది ఆధ్యాత్మికత వైపు అడుగులు వేయిస్తుంది. అందుకే నాంది (1), నవరసాలు (49-57), కవిత్వ సృష్టి (58), భరతవాక్యం (60) గురించి దీనిలో చెప్పడం జరిగింది. భరతవాక్యంలో "విశ్వశ్రేయః కావ్యమ్" అనే ఆర్యోక్తి ఉందని మళ్ళీ చెప్పాల్సిన అవసరం లేదు. ఇలా ఈ కావ్యంలో సమాజోపయోగి అయిన సమష్టి లక్షణాలను కవిశిరోమణి పొందు పరచారు.

ఇక 'సృష్టి'కి సంబంధించిన విషయాలను చూద్దాం. సృష్టి అంటే చరాచర ప్రకృతే కదా! ప్రకృతిని చూసి పరవశించని కవి ఉండడు. ఈ కవికూడా ప్రకృతికి సంబంధించిన చిత్రణ తన కావ్యంలో చేశారు. వదలని ముసురు (11), కొమ్మలకు పూగుత్తులు (12), కాలం (30), చెట్లు చిగురించడం (37), గాలి (40), దేవాలయాల మీద బూతుబొమ్మలు (13), ప్రపంచంలో వైరుధ్యాలు (22) - పై వాటిలో ప్రకృతికి సంబంధించిన అంశాలు కాక కాలం - వైవిధ్యమైన సృష్టికి, దేవాలయాల మీద బూతు బొమ్మలు - మానవ సృష్టికి, ప్రపంచంలో వైరుధ్యాలు - సృష్టితత్వానికి ప్రతీకలుగా పేర్కొనబడ్డాయి..

చివరిది 'పరమేష్ఠి'కి సంబంధించిన విషయం. ఇంతకు ముందు చెప్పిన వ్యష్టి, సమష్టి, సృష్టి విషయాలన్నీ పరమేష్ఠితత్వాన్ని అవగాహన చేసుకోవడానికి, ఆయనను చేరుకోవడానికి దోహదం చేసేవే. పై వాటిలో ఉన్నవికాక ప్రత్యేకంగా ఆధ్యాత్మికతకు సంబంధించిన ప్రశ్నలు చూడండి - ఎన్ని విడవాలి మనిషి (8), అనుబంధం (29), అహంకారం (38), మమకారం (39), ప్రాణికి మేనిఖైదు (41), గణేశమహోత్సవాలు (32), ఏదీ ఇమడదు పేగుల్లో (35), ఎక్కడ మన ఇల్లూ వాకిలీ (42). అహంకార, మమకారాలు వ్యక్తి ప్రతికూల లక్షణాల్లో వచ్చినా, వాటిత్యాగం ఆధ్యాత్మికతకు అత్యంతావశ్యకం. అందుకే మళ్ళీ దీనిలో చెప్పారు. ప్రాణికి మేనిఖైదు, ఏదీ ఇమడదు పేగుల్లో - అనేవి జీవుని వేదనను ప్రతిబింబిస్తున్నాయి. మిగతావన్నీ ఆధ్యాత్మిక భావాల్ని

 

అందిస్తూ పరమేష్ఠి తత్వాన్ని తెలుపుతూ 'ఏకంసత్ విప్రా బహుధావదంతి' అనే సత్యాన్ని వెల్లడిస్తున్నాయి. ఈ విధంగా ఆచార్య వసునందన్ గారు తమ 'అనుయోగం' కావ్యాన్ని ప్రశ్నోపనిషత్తుగా మలచి తత్త్వబోధ చేశారు. అనుయోగం ఒక గొప్ప తాత్త్విక కావ్యంగా కవి షష్టిపూర్తి సందర్భంగా వెలువడడం ముదావహం. ఆయన 'త్రిపదుల్లో' కవిత్వాన్ని ప్రత్యేకంగా నేను విశ్లేషించాల్సిన అవసరం లేదు. చదువరులు ఈ కావ్యాన్ని చదివి ఆ అనుభూతిని పొందుతారు. ఒక్కటి మాత్రం మచ్చుకు -

**ఎన్ని పువ్వుల కాంతి గుత్తులో కొమ్మలకు?**
**పసిపాపల నవ్వుల్లా రవ్వల్లా**
**పరిసరాలకు కొత్త అందాలు పూస్తూ** (12)

దీనికి వ్యాఖ్యానం అవసరం లేదు. అనుభూతే ప్రమాణం.

చివర ఒకమాట చెప్పి ముగిస్తాను. 'అనుయోగం' అనే కావ్యనామంలో 'అను' అనే ఉపసర్గ, 'యోగం' అనే పదం ఉన్నాయి. ఆ ఉపసర్గ చేరడం వల్ల ఇది ప్రశ్నగా అర్థాన్నిచ్చింది. అది రూఢ్యర్థం. అను-యోగం అనే మాటకు "యోగాన్ని అనుసరించి ఉండేది" అనే యౌగికార్థం చెప్పుకుంటే ఈ పేరులోనే అనేక విశేషాలు మనకు ద్యోతకమవుతాయి. 'యోగం' అనే మాటకు ధ్యానం, ఉపాయం, కూడిక, కవచం, ధనం, ఉద్యోగం, ఔషధం, నూతన వస్తుప్రాప్తి, రాజయోగం, అదృష్టం, సంబంధం, ఒక శాస్త్రం, సమయం, ఉపయోగం, విధానం, ఆధారం, వాహనం, ఫలితం, కార్యం, శరీరస్థైర్యం, భాగ్యం, సూత్రం, భక్తి - మొదలైన అనేకార్థాలను నిఘంటువులిచ్చాయి. వీటిని ఈ కావ్య నామానికి సమన్వయించి చూపితే ఓ ప్రత్యేక గ్రంథమే అవుతుంది. విజ్ఞులు ఆలోచింతురుగాక!

మొత్తంమీద 'అనుయోగం' కావ్యం - ఆధునిక (తెలుగు) ప్రశ్నోపనిషత్తుగా, తాత్త్వికంగా జీవుని వేదనను తెలపడానికి రచించిన నూత్నప్రయోగంగా, 'త్రిపదు'ల సంయోజనవల్ల ఆహ్వానించదగిందిగా కనబడుతూ సహృదయులను అలరించబోతూందన డంలో సందేహం లేదు. ఇలాంటి ఉత్తమ కావ్యాన్ని సాహితీ లోకానికందించిన ఆచార్య రావికంటి వసునందన్ గారిని మనసా, వాచా అభినందించకుండా ఉండలేను. షష్టిపూర్తి జరుపుకోబోతున్న ఈ శుభసందర్భంలో- సగం జీవితాన్ని విజయవంతంగా పూర్తి చేసుకొని, పూర్వార్థాన్ని ముగించుకొని ఉత్తరార్థంలోకి అడుగుపెడుతున్న ఆచార్యవర్యులు ఇతోధికంగా సరస్వతి సేవ చేయాలని అకాంక్షిస్తున్నాను.

ఈ వెన్నెల పాటలో రెండు మాటలు వ్రాసే అవకాశం నాకిచ్చినందుకు గురుతుల్యులు ఆచార్య వసునందన్ గారికి హృదయపూర్వక ధన్యవాదాలు.





# కవిశిరోమణి
# ఆచార్య రావికంటి వసునందన్

| | | |
|---|---|---|
| జననం | : | 04.05.1949 |
| జన్మస్థలం | : | కమాన్‌పూర్<br>కరీంనగర్ జిల్లా, ఆంధ్రప్రదేశ్ |
| తల్లిదండ్రులు | : | కీ.శే. శ్రీమతి జగ్గమాంబ, శ్రీ కిష్టయ్య |
| విద్య | : | ఎం.ఏ., ఎం.ఫిల్., పిహెచ్.డి |
| ఉద్యోగం | : | తెలుగు ప్రొఫెసర్<br>ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్, యు.జి.సి. మేజర్ రీసర్చ్ ప్రాజెక్ట్<br>డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం, హైదరాబాదు. |

## రచనలు

### కథా కావ్యాలు

రతీప్రద్యుమ్నము (గద్య కథాకావ్యం - 1971)
గురుకులము (విమర్శనాత్మక గద్య కథాకావ్యం - 1978)
భారతం (పద్య కథాకావ్యం - 1980 - డా॥ దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారకపురస్కారం పొందిన కృతి)
బలి (గేయ కథాకావ్యం - 1981)
కృష్ణం కలయ... (పద్య కథాకావ్యం - 2009)
అష్టాక్షరి (పద్య కథాకావ్యం - 2009)

### దీర్ఘ కావ్యాలు

త్రయి (1982)
మనస్సు (2004)
పిల్లలమఱ్ఱి (2006)
మట్టిముద్దలు (2007)
ఆయుధం కవిత్వం (2007)
ప్రవాహిని (2008)
బాలబ్రహ్మం (2008)

### గేయ కావ్యాలు

శ్రీరామ చరితామృతమ్ (పాటల్లో రామాయణం - 1992)
శ్రీవేంకటేశ్వర తారావళి (సంకీర్తనలు-2005)
ఎందరో మహానుభావులు (జీవిత చరిత్రలు - 2006)

### సాహితీ విమర్శ - పరిశోధన

భావదీపికలు (సాహిత్య వ్యాససంపుటి - 1980)
భూమిక - ఒక సమగ్ర పరిశీలనం (ఎం.ఫిల్. సిద్ధాంత వ్యాసం - 1985)
అష్టాక్షరి (సినారె కృతులపై సాహిత్య వ్యాసాలు - 1987)
ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం - విశ్వంభర విలక్షణత
(పిహెచ్.డి. సిద్ధాంత వ్యాసం - 1990)

### వచన కవితలు

సాధన (కవితా సంపుటి - 1981)
కలం కదిలితే... (కవితాసంపుటి - 2003)
మెరుపు మెరిస్తే... (కవితా సంపుటి-2004)
వాన కురిస్తే... (కవితా సంపుటి-2005)
నేల నవ్వితే... (కవితా సంపుటి-2006)
మనసు నిండితే... (కవితా సంపుటి-2006)
సింగిణీ మొలిస్తే... (కవితా సంపుటి-2006)
నెమలి ఆడితే... (కవితా సంపుటి-2008)
గుండె పొంగితే... (కవితా సంపుటి-2009)

### వివిధ కృతులు

వేణీ సంగమం (గేయం, పద్యం - 1975)
ప్రజావిజయం (రేడియోరూపకం - 1990)
ప్రయోజన దండకాలు (దండకాలు - 1993)
జైగణేశ్, బాలాజీ (భక్తిపాటల ఆడియో క్యాసెట్స్ - 1994)
లోవెలుగు (ముక్తకాలు - 2004)
రావికన్నులు (సంక్షిప్త కవితలు-2006)
బాలజ్యోతులు (పిల్లల కథలు-2007)
అనుయోగం (త్రిపదులు-2009)



### అనువాదాలు

దౌడ్ (హిందీ అనువాదం) డా.ఎం.రంగయ్య (2006)
రెసొల్యూట్ మైండ్ (ఇంగ్లీష్ అనువాదం) డా.బి.రామచంద్రయ్య (2006)
విరాట్ ఏకతా వట్ (హిందీ అనువాదం) డా. ఎం. రంగయ్య (2008)

### ముద్రణలో

భక్తి (దీర్ఘ కావ్యం)
అడుగడుగునా! (సంక్షిప్త కవితలు)
భారతనారీమణులు (పిల్లల కథలు)
భక్తశిఖామణులు (పిల్లల కథలు)

## పురస్కారాలు

ఎ.పి.ఎ.యు.యస్. సమాఖ్య కడప స్వర్ణపతక పురస్కారం (1982)
డా. దేవులపల్లి కృష్ణశాస్త్రి స్మారక పురస్కారం, హైదరాబాద్ (1982)
శ్రీ జమిలి నమ్మాళ్వార్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1990)
శ్రీ తేరాల జగదీశ్వర్ స్మారక పురస్కారం, హైదరాబాద్ (1993)
శిల్పా ఆర్ట్ క్రియేషన్స్ ఉత్తమ విద్యావేత్త పురస్కృతి, హైదరాబాద్ (1993)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉత్తమ అధ్యాపక పురస్కృతి, హైదరాబాద్ (2002)
డా. వానమామలై వరదాచార్య సాహిత్య పురస్కారం, కోరుట్ల (2003)
కవిశిరోమణి బిరుదప్రదానం - భారతీ సాహిత్య సమితి, కోరుట్ల (2003)
డా.జె.ఆర్.ఇ.టి.రజతోత్సవస్వర్ణపతక,స్వర్ణకంకణపురస్కారం,జగిత్యాల (2003)
వానమామలై జగన్నాథాచార్య సాహిత్య పురస్కారం, కరీంనగర్ (2004)
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఉగాది పురస్కారం, హైదరాబాద్ (2004)
పొట్టిశ్రీరాములు తెలుగువిశ్వవిద్యాలయం ధర్మనిధిపురస్కారం, హైదరాబాద్ (2004)
ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం - భాషావేత్త పురస్కారం, రంగారెడ్డి (2006)
శ్రీ దోమా వేంకటస్వామిగుప్త సాహిత్య పురస్కారం, కడప (2007)
తేజ ఆర్ట్ క్రియేషన్స్, సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2007)
భారత పర్యావరణ పరిరక్షణ గవాక్షం - రంగారెడ్డి జిల్లా పురస్కృతి (2008)
తేజ ఆర్ట్ క్రియేషన్స్-ఆచార్య తిరుమల సాహితీ పురస్కారం, హైదరాబాద్ (2008)



## 1

### ఎంత తెలుగు కవిత్వం?

అమృతంలా అంబుధిలా ఆకాశంలా,
అవనీతలాన్ని పునీతం చేస్తూ.

## 2

### అంతటా ఎంతటి స్వార్థం?

పరమాణవుల్లో పగిలే జ్వాలలా,
నిరంతరం రగిలే తత్త్వంతో.





## 3

### ఎంత దురదృష్టకరం క్రోధం?

పేగులు పేల్చేసే విషంలా,
అన్నీ నాశనం చేస్తూ.

## 4

### ఎంత భయంకరం లోభం?

నిలువునా మింగేసే చిలువలా,
తనకు కష్టమైనా పరవిదారణం చేస్తూ.







## 5

### ఎంత వినాశకరం మోహం?

వేరు కొరికే చెదలులా,
సమూలంగా వ్యవస్థను కూలుస్తూ.

## 6

### ఎంత దుర్భరం మదం?

కర్రకోసే రంపంలా,
ఎటు పడినా ఏకధాటిగా కోసేస్తూ.





# 7

## ఎంత విధ్వంసకరం మాత్సర్యం?

అంటుకుంటే ఆరని చితిలా,
అంగాంగాలను భస్మీభూతం చేస్తూ.

# 8

## ఎన్ని విడవాలి మనిషి?

మబ్బు విడిచిన సూర్యునిలా,
లోకాల చీకట్లు తొలగిస్తూ.







# 9

## ఎంత ఉద్ధృతం జీవితం?

అనుభవాల అనుభూతుల వరదలా,
వ్యక్తిత్వాన్ని పరిపూరితం పరిపూతం చేస్తూ.

# 10

## ఏమిటీ ఆశల వరుస?

మొదటి తేదీ ఎటిఎమ్ క్యూలా,
జగమొండి శిఖండితనాన్ని వెలారుస్తూ.





## 11

### ఏమిటీ వదలని ముసురు?

బెల్లం మీది ఈగ మేఘుంలా,
ఎటూ తోచని చికాకు చిందిస్తూ.

## 12

### ఎన్ని పువ్వుల కాంతిగుత్తులో కొమ్మలకు?

పసిపాపల నవ్వుల్లా రవ్వల్లా,
పరిసరాలకు కొత్త అందాలు పూస్తూ.







## 13

### ఎందుకు దేవాలయాల మీద బూతు బొమ్మలు?

పాలిచ్చే తల్లి తొలగిన పైటలా,
జీవచైతన్యానికి పురుడుపోస్తూ.

## 14

### ఎందుకు ములుకుల్లాంటి ప్రశ్నలు?

వివేకం మత్తునెక్కించే సూదిలా,
సామాజిక జాడ్యాలకు శస్త్ర చికిత్స చేస్తూ.







## 15

### ఎంతవరకు పై పై కోటింగులు?

పుట్టమీద కొట్టే దెబ్బల్లా,
లోపలికంపును చంపలేనప్పుడు.

## 16

### ఎందుకు అలవడదు సహనం?

పాత్ర మెరిసే కళాయి పూతలా,
వ్యక్తిత్వానికి మెరుగులు దిద్దుతూ.





## 17

### సాధ్యమా పల్లేరు మీది పయనం?

నల్లేరు మీది నడకలా,
ఓర్పుకు అగ్నిపరీక్ష పెడుతూ.

## 18

### ఎందుకు మంచికి నరకయాతనలు?

శిలువను చీల్చే శిక్షలా,
ఉక్కుముక్కులతో వేడినెత్తురు పీలుస్తూ.





## 19

### ఎందుకు వదలదు మూర్ఖత్వం?

కట్టెను పట్టిన చెదలులా,
ప్రగతి కేదారాలను నిస్సారం చేస్తూ.

## 20

### ఎందుకు సాధ్యంకాదు సమయపాలనం?

ఎటుపోవాలో తోచని ఎండ్రికాయలా,
వ్యక్తి సామర్థ్యాన్ని వ్యర్థంచేస్తూ.







## 21

### ఎందుకు తీరదు సంపాదనా దాహం?

నెయ్యి తాగిన దప్పికలా,
ఆకాశమంత ఎత్తులు వేస్తూ.

## 22

### ఎలా సాగుతుందీ ప్రపంచం వైరుధ్యాలతో?

ఎద్దునూ దున్ననూ కలిపికట్టిన బండిలా,
ఎద్దు ఎండకూ దున్న నీడకూ లాగితే.





## 23

### ఎంత గొప్పది కృతఘ్నత?

కన్న కడుపును చీల్చే గాజు పెంకులా,
మానవత్వాన్ని మంటగలుపుతూ.

## 24

### ఎంత అసహ్యం విచ్చల విడితనం?

సిటీ రోడ్లపై టూవీలర్ పై సాగే జంటలా,
కిందా మీదా కానక కిందా మీదా పడుతూ.







## 25

### ఎంత వికృతం చాదస్తం?

మనిషికి మొలిచిన మూడో హస్తంలా,
ఎంతవరకు పనికి వస్తుందో తెలియక.

## 26

### ఎంత అయస్కాంతం ఆకర్షణ?

అందాన్ని మింగేసే కులుకులా,
అన్ని అడ్డంకులూ అధిగమిస్తూ.







## 27

### ఎందుకు ముసలితనానికి కుసుమ గుడాలు?

కాకికి తొడిగే నగలలా,
వ్యామోహానికి అంచులు దిద్దుతూ.

## 28

### ఎంత అపురూపమో సొంత మోహం?

వాల్ పోస్టర్లకు పూసే గోందులా
సందులేకుండా అలుముకుంటూ.





## 29

### ఎంత బలీయం అనుబంధం?

తెంపరాని నరాల ముడిలా,
జిడ్డోడుతున్నా ముద్దొస్తూ.

## 30

### ఎంత క్రూరం ఒక్కోసారి కాలం?

ద్రౌపదికోసం చూసే కౌరవసభలా,
సౌజన్యానికి ప్రత్యక్ష నరకం చవిచూపిస్తూ.







## 31

**ఎంత చంచలం మనస్సు?**

కొమ్మల మీది కోతిలా,
ఎటుదూకుతుందో ఎరుగక.

## 32

**ఎందుకు గణేశ మహోత్సవాలు?**

హాశ్శరభ హాశ్శరభ శరభలా,
సంస్కృతీ సంప్రదాయాలను నిత్య జాగృతం చేస్తూ.





## 33

**ఎందుకు అదుపులేని ఆవేశం?**

కణకణమండే చింతనిప్పులా,
తననూ ఎదిరినీ భస్మం చేస్తూ.

## 34

**ఇంకేం కావాలి పరార్థ జీవితానికి?**

దులిపేసే నిండు సంచిలా,
ఎక్కడకక్కడ పంపకాలు చేస్తూ.





## 35

### ఎందుకు ఏదీ ఇమడదు పేగుల్లో?

కుక్క గతికిన నెయ్యిలా,
కడుపులో చెయ్యి పెట్టి దేవుతూ.

## 36

### ఎలా పిండుకోవాలి సహనం అసహ్యత నుండి?

ఈగకాటునుండి తేనెలా,
నిరంతరాభ్యాసం ప్రత్యగ్రంగా మెరిపిస్తూ.







## 37

### ఎందుకు చిగురిస్తాయి చెట్లు?

ఉరుము సవ్వడికి నెమలి పురిలా,
పర్యావరణానికి ప్రాణం పోస్తూ.

## 38

### ఎందుకు జడలు విదిలించే అహంకారం?

కసుక్కున కరిచే కొత్త చెప్పులా,
చెప్పరాని పీడను పిండిపోస్తూ.







## 39

### ఎందుకు ఎడతెగని మమకారం?

నడిదారిలో తెగిన చెప్పులా,

అన్ని విధాలా బాధిస్తూ.

## 40

### ఎందుకు ప్రవహిస్తుంది గాలి?

సోమరితనం తెలియని పరోపకారిలా,

జగత్తుకు ప్రాణాలు పోస్తూ.



## 41

### ఎందుకు ప్రాణికి మేని ఖైదు?

తిత్తిలో కట్టేసిన గాలిలా,

ఊపిరి సలపనీయకుండా చేస్తూ.

## 42

### ఎక్కడ మన ఇల్లూ వాకిలీ?

కర్ర భవంతి – బూడిదబుంగ లోగిలిలా,

అశాశ్వతత్వం నిత్య సత్యమని చాటుతూ.





## 43

### ఎంతకమ్మటి ప్రలోభాలు?

మధుమేహానికి తేనె చినుకుల్లా,
మాయ ఊబిలో మరింత దించుతూ.

## 44

### ఎందుకు గౌరవిస్తారు ఎవరైనా?

అవసరమో ఆశో బులిపిస్తే తప్ప మెరుపులా,
మనసు కత్తికి పదును అద్దుతూ.







## 45

### ఎందుకు ప్రతిదానికీ శోధన?

అనుమానం పెనుభూతంలా,
నీటిలోనూ నిప్పులే మొలిపిస్తూ.

## 46

### తప్పుతుందా ఒంటరికాక స్వాతిశయం?

చుట్టూ నీళ్లున్న గుట్టలా,
అన్నికాళ్లనూ కట్టివేస్తూ.





## 47

### ఎందుకు ఎప్పుడూ చిటపట?

చితికి అంటించిన నిప్పులా,
వాతావరణ వినాశానికి నడుంబిగిస్తూ.

## 48

### ఎందుకు అప్రతిహతం కడుపులో మంట?

తోడే కొద్దీ ఊరే ఊటలా,
ప్రతిక్షణం ఆయువుతో పోటీ పడుతూ.







## 49

### ఎంత గొప్పది కరుణరసం?

పరమార్థ పరమాత్మ తత్వంలా,
అన్ని రసాలకూ అసలు పుట్టిల్లుగా.

## 50

### ఎందుకు రసరాట్టు శృంగారం?

ప్రవహించే ప్రాణవాయువులా,
నిమిత్త భేదాలతో అన్నిటికీ ఆలంబనగా.





## 51

### ఎందుకు చెలరేగుతుంది వీరం?

ఎదురెరుగని జీవశక్తి నిరూపణలా,
శృంగార రస పరిపూరకంగా.

## 52

### ఎందుకు పెల్లుబుకుతుంది రౌద్రం?

దెబ్బతిన్న కోడె బెబ్బులిలా,
శృంగార విఘాతానికి ఫలితంగా.







## 53

### ఎందుకు భీభత్స రసావిష్కరణ?

పగలబడిపోయే శ్మశానంలా,
వీరరౌద్రాలకు నారసంగా.

## 54

### ఎందుకు వణికిస్తుంది భయానకం?

గుండె జలదరింపు శృతిలా,
రౌద్రభీభత్సాల ప్రతిఫలంగా.





## 55

### ఎందుకు కొత్త ప్రాణం పోస్తుంది హాస్యం?

జవసత్వాలు కూర్చే దివ్యౌషధంలా,

మేనులపై తళతళలు మిలమిలలాడగా.

## 56

### ఎందుకు అత్యద్భుతం అద్భుతరసం?

హరివిల్లు చూసే పసిపిల్ల తెరిచిన నోటిలా,

ప్రకృతి సౌందర్య పర్యవేక్షణగా.







## 57

### ఎందుకు సౌఖ్య సంధాయిని శాంతం?

చల్లగా సాగే పిల్ల గాలిలా,

లోకాలకు జీవధాతువుగా.

## 58

### ఎందుకు నాకిన్ని ప్రసవ వేదనలు?

పోటెత్తే గంగా తరంగాల్లా,

రసజగత్తులు ఆవిష్కరిస్తూ.





## 59

## ఎందుకు సత్ప్రయత్నాలకు అగ్ని పరీక్షలు?

జాతిమణులకు సానల ఒరిపిడుల్లా,
సంస్కార రోచిస్సులు అభిషేకిస్తూ.

## 60

## ఎందుకు ఉండాలి లోకాలన్నీ సుఖంగా?

ఎండకూ వానకూ వసివాడని పువ్వుల్లా,
మానవతా సత్ఫలాలను ప్రసాదిస్తూ.

